# భావగీతం

## దీర్ఘకావ్యం




కవిశిరోమణి
ఆచార్య రావికంటి వసునందన్

# రసోవైసః

ఆచార్య కోవెల సుప్రసన్నాచార్య
తెలుగు విశ్రాంతాచార్యులు
కాకతీయ విశ్వవిద్యాలయం

మా వసునందన్‌ను తలచుకోగానే ఎన్నో జ్ఞాపకాలు. నాల్గు దశాబ్దాల వెనుకకు వెళ్ళి చూచుకుంటే ఎన్ని దృశ్యాలు! అవ్యక్తభావి స్వప్నంతో – గంపెడు కుప్ప పోసుకున్న ఆశలతో వసునందన్ ఈనాటి స్థితికి ఎలా సూచనలివ్వగలడు? నాటికి అతని రచన **రతీప్రద్యుమ్నము** ప్రాచీన రీతిలోని మధుర వచనం. అతని డిగ్రీలు లేని పాండిత్యం–ఎవరు గుర్తించాలి? తొలుత ఆ పని మా రామరాజు గారు చేశారు. దాని ఆవిష్కరణ సభ వరంగల్ ఏవీ హైస్కూల్‌లో నేను ఏర్పరచాను. స్వప్నం నేలకు దిగివచ్చినట్లయింది వసునందన్‌కు.

అప్పటి నుంచి ఎన్ని మెట్లు ఎక్కాడు (ఇది మనకు కనిపించే అంశమే అయినా ఎన్ని మెట్లనుంచి జారిపడ్డాడో త్రోసివేయబడినాడో మనకు తెలియరాదు. ఐనా ఎప్పుడూ ఎవరిని గురించీ అనుకూలంగా మాట్లాడటం నేను వినలేదు) ఎప్పుడూ ముఖం నిండా పొంగి పొర్లే నవ్వుతో ఎదుటివాళ్ల కష్టాన్ని కడిగివేసే రీతిలో కనిపిస్తాడు వసునందన్.

పైన పేర్కొన్న వసునందన్ ఎవరూ? అంటే బహు కావ్య నిర్మాత, నిరంతర సృజనశీలీ, పద్య విద్యా కుశలుడూ అయిన కవిశిరోమణి ఆచార్య వసునందన్. **ఆయుధం కవిత్వం** అన్న ఆయన వ్రాతప్రతి చూచినప్పుడు ఈ బిరుదు నాకర్థం అయింది – నన్నయ నుండి నేటి దాకా తెలుగు కవులందరూ ఆయనకు శిరోభూషణాలని.

వసునందన్ తొలినుంచీ ఆస్తికుడు. దైవచింతనాపరుడు. వరుసగా అల్లుకుంటూ వస్తున్నాడు ఎన్నో కావ్యాలను. ప్రవాహినిలో చరిత్రనంతా చుట్టూ అల్లుకున్నాడు. అప్పుడప్పుడూ 'మతం' మీద కస్సుబుస్సుమంటాడు. రాజకీయం, మతం ముసుగు లోనే కదా ఇంత దౌర్జన్యం. మతం దోషం ఎంత? ఇప్పుడు జీవితంలో అన్ని రంగాలనూ రాజకీయం కలుషితం చేస్తున్నప్పుడు మనం ఏం చెప్పుదాం!

ఇప్పుడు మరొక కావ్యం–నూటొక్క పద్యాలు–శతకం కావచ్చు. తాను దీర్ఘకావ్యం అంటున్నాడు. ఈ కాలం పాఠకులకు ఈ మాత్రమే దీర్ఘ కావ్యమయినట్లున్నది.

ఈ వినుతి హరిహరులను గురించింది. అందుకే దీన్ని **భావగతం** అన్నాడు. భాగవత శబ్దం కొంచెం మారింది. అయినా యిది భావగతమైనా భాగవతమే అయింది.అయినా షాడ్గుణ్య పరిపూర్తి ఒక్క హరిహరాత్మకమైన పరతత్త్వమందే నిలిచి ఉంటుంది కనుక. "భద్రాయతమూర్తియై హరిహరంబగు రూపము దాల్చి" ఇదొక వైలక్షణ్యం. మూర్తి భేదం ఆత్యంతికం కాదు. అరుణాచలం గిరి ప్రదక్షిణ చేస్తున్నప్పుడు ఆ కొండ ఒక్కోచోట ఒక్కో విధంగా దర్శనమిస్తుంది. ద్రష్టను బట్టి, అతని నిలిచి ఉన్న స్థానాన్ని బట్టి దర్శనం మారిపోతుంది. పరతత్త్వానుభవమూ అంతే. భావం అంటే ఉనికి. **భావగతం** అంటే ఉనికిలో ఉండే ఆత్యంతికమైన తత్త్వం. అంటే సత్పదార్థం. మిగిలిన అసత్పదార్థం నుండి విడదీసి చూడటం, అంటే మూలమును చేరుకోవటం. మేడ నెక్కిన వానికి అక్కడి ఉనికి మిగులుతుంది కాని ఆతడెక్కిన నిచ్చెన తొలగిపోతుంది. అసత్పదార్థం–సాధకునికి తత్పారమార్థిక దృష్టి లేకపోతే కేవలం సాధనంగానే మిగిలిపోతుంది.

మన లక్ష్యం ఆ నెలకొని ఉన్న పదార్థం. పెద్దలు మనకు దాన్ని గురించి ఎంతో చెప్పినారు. మన కోసం దిగివచ్చినప్పుడు, ఆ సత్‌చేతన మన అనుభవంలోకి వచ్చినప్పుడు ఎన్నో లీలలు వ్యక్తములయ్యాయి. ఈ లీలల్లో గర్భితంగా అవ్యక్తంగా దాని తేజస్సు స్ఫురిస్తుంది. **భావగతం** రెండు కొసలనించీ ఆ చైతన్యాన్ని పట్టుకునే ప్రయత్నం చేసింది.

శైవవైష్ణవ కథా వాఙ్మయం ఇటువంటి రచనల్లో ముడిసరుకు అవుతుంది. విష్ణుదేవుని పర, వ్యూహ, విభవ, అంతర్యామి అర్చావతార రూపాలు, ముఖ్యంగా విభవంలో అవతారాలు ఈ వర్ణనకు మూలస్రోతస్సు. భగవంతుని లీలావిభవం అపరిమేయమైన ఆతనిని పరిమితమైన మన చిత్త పరిమితులలోనికి నిలబెడుతుంది. అందువల్ల శతకాలు, మాహాత్మ్యక కథనాలు శైవ వైష్ణవ పురాణా గాథా సందర్భాలతో నిండి ఉంటవి.

జీవునికి అత్యంతమూ ఇష్టమైంది భగవంతుని కారుణ్యం. ఆ కారుణ్యం వల్లనే తన దుఃఖాన్ని పోగొట్టుకుంటాడు. ఆ కారుణ్యమే వర ప్రదాన రూపమై భక్తుని అభీష్టాలను నెరవేరుస్తుంది. ఈ విధంగా కారుణ్యం ఈశ్వరునికీ జీవునికీ నడుమ



బంగారు నిచ్చెన అవుతుంది. వసునందన్ తన కవితలో అనేక రచనలలో ఈ కారుణ్య సేతువును నిర్మిస్తున్నాడు. భగవంతునికీ చేరువవుతున్నాడు. పద్యం వసునందన్‌కి చిర అభ్యస్త రూపం. దానిలో ఆధునిక కవులు తెచ్చిన విశేష ప్రయోగాలతోనూ అతనికి సాన్నిహిత్యం ఉంది. నిజానికి ఆధునిక కవులు నిర్మించిన భక్తి వాఙ్మయం రాశిలోనూ వాసిలోనూ ఏ ఇతర శాఖ కన్నా తీసి పోయేది కాదు. **ఒకదానికొకటి పొసగని / కొకిబికి ఎగుడిగుడు కన్ను కూడలి!** అని శివుని సంబోధిస్తున్నాడు. ఈ ప్రయోగము మరీ కొత్తది! ఎగుడుదిగుడులో 'మధ్య దు' లోపించినా అందంగానే ఉంది. శివుడు చంద్రసూర్యాగ్ని నేత్రుడనేది ధ్వని.

వ్యాజనిందా రూపమైన ఈశ్వరస్తుతి మనకు క్రొత్తదేమీ కాదు. నిర్గుణుడు, నీరూపుడైన పరమాత్మ భక్తానుగ్రహం కోసం రూపం ధరించి వస్తే ఆ రూపంతో మనం పరాచికాలాడుకోగలగటం ఒక్క హిందూ సమాజంలోనే ఉన్నది. అందువల్లనే పురాణ గాథల విషయంలో మన చిత్తానికి తగిన పరివర్తనలు చేసుకోవడం మనకు ఆదినుండే వస్తున్న అంశం. ఈ సాహసానికి కారణం మన చేతోమూలాలలో ఈ గాథలు, రూపాలు, సన్నివేశాలు అన్నీ వ్యావహారిక సత్యాలే కానీ పారమార్థిక సత్యాలు కావని మనకు నిత్యంగా తెలిసి ఉండటమే. అందువల్లనే ఈ నాటికీ దేవతారూప కల్పనలో మన బుద్ధి కల్పన. వేనవేల రూప నిర్మాణాలు చేయటం, వాటి యందు మనం విరోధ భావాన్ని ప్రకటించకపోవటం, వినాయక చవితి వంటి ఉత్సవాలలో గమనించవచ్చు.

ఈ రచన నిండా భగవంతుని పట్ల వ్యాజోక్తి **నవరసాత్మకంగా** పెల్లుబికింది. హృద్యమైన పద్యం కవి ప్రతిభాధీనమై ప్రసరించింది. అందరూ చదువుకొని మననం చేయదగిందిగా ఉన్నది. కవిశిరోమణి ఆచార్య రావికంటి వసునందన్ ఇంకా ఎన్నో మెట్లు ఎక్కాలని, తెలుగు కవితకు జాతీయస్థాయిలో మన్ననలు తేవాలని ఆశిస్తూ ఆశీర్వదిస్తున్నాను.

27-02-2010

## భాగవతం

ఆచార్య బేతవోలు రామబ్రహ్మం
తెలుగు శాఖాధ్యక్షులు
హైదరాబాద్ కేంద్ర విశ్వవిద్యాలయం

మా వసునందన్‌గారి కవితావాహిని ఇటీవల వఱదగోదారి అయ్యింది. పద్యసంపుటులు వరసగా వచ్చేస్తున్నాయి. ఎంత ఆనందం!

ఇది శతతం కాని శతకం. నూటొక్క పద్యాలైతే ఉన్నాయి గానీ దేని కిరీటం దానిదే అయ్యింది. మకుట నియమానికి సడలింపుతో ఇది శతకం. ఇందులో రాముడున్నాడు. వేణుగోపాలుడున్నాడు. చంద్రశేఖరుడున్నాడు. వేంకటేశ్వరుడున్నాడు. యాదగిరీశ్వరుడున్నాడు. బదరీనారాయణుడున్నాడు. అలాగే నాలుగురకాల వృత్తాలున్నాయి. కందాలు ఉన్నాయి. కొందరు పద్దెరాణులు గద్దె మీదకి వచ్చారుగానీ కిరీటాలు మర్చిపోయారు. ఇన్ని రకాల వైవిధ్యాల కూడలి ఈ **భావగతం**. దీన్ని కన్న ఊరి పురాణదేవతలకు అంకితం చేసి మరింత పుణ్యం మూటగట్టుకున్నారు వసునందన్‌గారు.

సాధారణంగా శతకకవుల్ని దశావతారాలు ఆదుకుంటాయి. వీరిని ముమ్మడుగులుగా ఆదుకున్నాయి. అయితే వీరు ఆయా అవతారాల ఘనకార్యాలను స్తుతించి ఊరుకోలేదు. వాటిని ఈనాటి మానవ స్వభావాలకు, వరుసగా నవరసాలకు మిలాయించి ఆలోచనలు రేకెత్తించి సున్నితంగా ప్రబోధాలు అందించారు. వెరసి నూటొక్క పద్యాలలోనూ – కొన్నింట భావచారిమ, అన్నింటా పదప్రయోగవైచిత్రి, కొన్నింట శబ్దాలంకారం ఇలా ఏదో ఒక యంత్రప్రతిష్ఠ చేసుకుంటూ వెళ్ళారు.



నూట ఒకటవ పద్యం మాత్రం నిస్సందేహంగా ధ్వజస్తంభం. అదొక్కటే ఉదాహరించి మీకు అడ్డం తప్పుకుంటాను.

**పాదద్వంద్వము మట్టుగా, తనుపురోభాగంబు కాండంబుగా,**
**మీదన్ గ్రాలు శిరమ్ము దొన్నెగను, నామేనెల్ల కంబంబుగా,**
**ప్రోదిన్ నాడులు వత్తులై, నొసటి దీప్తోత్సాహ భక్తి ప్రప**
**త్త్యాదుల్ నూనెగ వెల్గనిమ్ము పరమాత్మా! ఆత్మదీపప్రభల్**

ఈ శతకంతో విరోధికి వీడ్కోలు పలికారు. వికృతికి స్వాగతం పలికే పద్యకృతి కోసం ఎదురుచూస్తూ – సెలవు.

ఉ.
బేతవోలు రామబ్రహ్మం
07.03.09

## కవిశిరోమణి

## ఆచార్య రావికంటి వసునందన్



జననం : 04.05.1949

జన్మస్థలం : కమాన్‌పూర్
కరీంనగర్ జిల్లా, ఆంధ్రప్రదేశ్

తల్లిదండ్రులు : కీ.శే. శ్రీమతి జగ్గమాంబ, శ్రీ కిష్టయ్య

విద్య : ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి

ఉద్యోగం : తెలుగు ప్రొఫెసర్
ప్రిన్సిపల్ ఇన్వెస్టిగేటర్, యు.జి.సి. మేజర్ రీసర్చ్ ప్రాజెక్ట్
డా. బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం, హైదరాబాదు.

## రచనలు

### కథా కావ్యాలు

రతీప్రద్యుమ్నము (గద్య కథాకావ్యం - 1971)

గురుకులము (విమర్శనాత్మక గద్య కథాకావ్యం - 1978)

భారతం (పద్య కథాకావ్యం - 1980 - డా॥ దేవులపల్లి కృష్ణశాస్త్రి స్మారకపురస్కారం పొందిన కృతి)

బలి (గేయ కథాకావ్యం - 1981)

కృష్ణం కలయ... (పద్య కథాకావ్యం - 2009)

అష్టాక్షరి (పద్య కథాకావ్యం - 2009)

కవిశిరోమణి ఆచార్య రావికంటి వసునందన్ పద్యరత్నావళి (2009)

పంచాక్షరి (పద్యకథాకావ్యం - 2010)



### దీర్ఘ కావ్యాలు

త్రయి (1982)

మనస్సు (2004)

పిల్లలమఱ్ఱి (2006)

మట్టిముద్దలు (2007)

ఆయుధం కవిత్వం (2007)

ప్రవాహిని (2008)

భక్తి (2009)

భావగతం (2010)

### గేయ కావ్యాలు

శ్రీరామ చరితామృతమ్ (పాటల్లో రామాయణం - 1992)

శ్రీవేంకటేశ్వర తారావళి (సంకీర్తనలు-2005)

ఎందరో మహానుభావులు (జీవిత చరిత్రలు - 2006)

భక్తశిఖామణులు (పాటల పేటిక - 2010)

### సాహితీ విమర్శ - పరిశోధన

భావదీపికలు (సాహిత్య వ్యాససంపుటి - 1980)

భూమిక - ఒక సమగ్ర పరిశీలనం (ఎం.ఫిల్. సిద్ధాంత వ్యాసం - 1985)

అష్టాక్షరి (సినారె కృతులపై సాహిత్య వ్యాసాలు - 1987)

ఆధునికాంధ్ర కవిత్వంలో మానవతావాదం - విశ్వంభర విలక్షణత (పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసం - 1990)

### వచన కవితలు

సాధన (కవితా సంపుటి - 1981)

కలం కదిలితే... (కవితాసంపుటి - 2003)

మెరుపు మెరిస్తే... (కవితా సంపుటి-2004)

వాన కురిస్తే... (కవితా సంపుటి-2005)

నేల నవ్వితే... (కవితా సంపుటి-2006)

మనసు నిండితే... (కవితా సంపుటి-2006)

సింగిణీ మొలిస్తే... (కవితా సంపుటి-2006)

నెమలి ఆడితే... (కవితా సంపుటి-2008)

గుండె పొంగితే... (కవితా సంపుటి-2009)

**వివిధ కృతులు**

వేణీ సంగమం (గేయం, పద్యం - 1975)

ప్రజావిజయం (రేడియోరూపకం - 1990)

ప్రయోజన దండకాలు (దండకాలు - 1993)

జైగణేశ్, బాలాజీ (భక్తిపాటల ఆడియో క్యాసెట్స్ - 1994)

లోవెలుగు (ముక్తకాలు - 2004)

రావికన్నులు (సంక్షిప్త కవితలు-2006)

అనుయోగం (త్రిపదులు - 2009)

అడుగడుగునా! (సంక్షిప్త కవితలు-2009)

**బాలసాహిత్యం**

బాలజ్యోతులు (పిల్లల కథలు-2007)

బాలబ్రహ్మం (దీర్ఘకావ్యం-2008)

భారతనారీమణులు (పిల్లల కథలు-2009)

**అనువాదాలు**

దౌడ్ (హిందీ అనువాదం) డా.ఎం.రంగయ్య (2006)

రెసొల్యూట్ మైండ్ (ఇంగ్లీష్ అనువాదం) డా.బి.రామచంద్రయ్య (2006)

విరాట్ ఏకతా వట్ (హిందీ అనువాదం) డా. ఎం. రంగయ్య (2008)



**ముద్రణలో**

మనతెలంగాణ (దీర్ఘకావ్యం)

అరవై నిండితే... (కవితా సంపుటి)

చంపుడుగుళ్ళు (దీర్ఘకావ్యం)

**పురస్కారాలు**

ఎ.పి.ఎ.యు.యస్. సమాఖ్య కడప స్వర్ణపతక పురస్కారం (1982)

డా. దేవులపల్లి కృష్ణశాస్త్రి స్మారక పురస్కారం, హైదరాబాద్ (1982)

శ్రీ జమిలి నమ్మాళ్వార్ స్మారక పురస్కారం, హైదరాబాద్ (1990)

శ్రీ తేరాల జగదీశ్వర్ స్మారక పురస్కారం, హైదరాబాద్ (1993)

శిల్పా ఆర్ట్ క్రియేషన్స్ ఉత్తమ విద్యావేత్త పురస్కృతి, హైదరాబాద్ (1993)

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఉత్తమ అధ్యాపక పురస్కృతి, హైదరాబాద్ (2002)

డా. వానమామలై వరదాచార్య సాహిత్య పురస్కారం, కోరుట్ల (2003)

కవిశిరోమణి బిరుదప్రదానం - భారతీ సాహిత్య సమితి, కోరుట్ల (2003)

డా.జె.ఆర్.ఇ.టి. రజతోత్సవస్వర్ణపతక,స్వర్ణకంకణపురస్కారం,జగిత్యాల (2003)

వానమామలై జగన్నాథాచార్య సాహిత్య పురస్కారం, కరీంనగర్ (2004)

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఉగాది పురస్కారం, హైదరాబాద్ (2004)

పొట్టిశ్రీరాములు తెలుగువిశ్వవిద్యాలయం ధర్మనిధిపురస్కారం, హైదరాబాద్ (2004)

ఆంధ్రప్రదేశ్ అధికార భాషాసంఘం - భాషావేత్త పురస్కారం, రంగారెడ్డి (2006)

శ్రీ దోమా వేంకటస్వామిగుప్త సాహిత్య పురస్కారం, కడప (2007)

తేజ ఆర్ట్ క్రియేషన్స్, సాహితీ పురస్కారం, హైదరాబాద్ (2007)

భారత పర్యావరణ పరిరక్షణ గవాక్షం - రంగారెడ్డి జిల్లా పురస్కృతి (2008)

తేజ ఆర్ట్ క్రియేషన్స్-ఆచార్య తిరుమల సాహితీ పురస్కారం, హైదరాబాద్ (2008)

కౌముది ప్రతిభా పురస్కారం, హైదరాబాద్ (2009)



1. ఎన్నో వేదనలోర్చుచుంటి భవదీయేచ్ఛాప్రకారంబుగా
మన్నుల్ మిన్నులు గ్రమ్మివేసెడి జగన్మాయా ప్రభావంబుతో
కన్నాకై వటపత్రశాయి! పరిరక్షా స్ఫూర్తి భాసించి నా
కన్నయ్యా! కడలేని యాతనల దిక్కై కావరావే దయన్

2. నీవె తీయగ నొప్పు మాయతెరలన్ నిర్హేతుక ప్రీతితో
నీవే కోయగ కర్మ బంధముల నిర్ఛిద్రంబుగా జెల్లెడిన్
నీవే తప్ప నితఃపరంబెరుగనే నిర్వేద చిత్తంబుతో
నీవే దిక్కని నీవె మ్రొక్కనుచు నిర్ణీతంబుగా గొల్చెదన్

3. ఎంతటి దుఃఖమిద్ది హృదయేశ్వర! గ్రుద్దిన గ్రుద్దు గ్రుద్దుగా
స్వాంతము బొప్పాడింబొనర సల్పుచునున్నది; కాలకూటమై
యంతము లేక నాంత్రతతి నంతయు జీల్చుచునున్నదెందు నా
వంతయు శాంతిలేని పెనువంతల గూల్చుచు నున్నదేమనన్

4. నీవె హృషీకనాథుడవు నిశ్చయ బుద్ధిని నిర్ణయించినన్
నీవె నిరంజనాకృతివి నిర్మల సత్కరుణా ప్రవృత్తివై
నీవె సృజించ పెంచగను నిక్కిన ద్రుంచగ జీవజాలమున్
నీవె తలంచ దిక్కగుచు నిల్చెద వెప్పుడు దిక్కు దిక్కులన్

5. కావున గావగావలయు కారణకారణ! శోకవారణా!
పావనచిత్త వారణ విపద్వినివారణ కీర్తి చారణా!
నీవె రసార్ద్ర మూర్తివి! వినీత రసోచిత సత్ప్రబంధ సం
సేవలొనర్తు నావరణ సిద్ధి వెలుంగవె గుండెపాదులన్

6. **కరుణరసమ్ము** కన్గొనలగ్రాలు దయామతి! పద్మకాంతి సం
చరణ కటాక్షరమ్యరుచి! శాంకర విద్యుతి! దివ్య సాంఘికా
వరణ విశేషశాంతి మత వైభవలోక విధాత! బుద్ధదే
వర! నిలువెల్ల వత్సలత భాసిలు నిన్వినుతింప విందగున్

7. ఎవ్వని గుండె కొట్టుకొనె నెంతయు నెండిన బోధిపత్రమై
రివ్వన నంబరాంతరము రెక్కల దున్నుకపోవు నంచ కె
వ్వెవ్వని యంపవాదర భువిన్బడ హత్తుకొనెన్ దయాళువై
చివ్వన గ్రోవి గారుణిక శేఖరమై యమృతమ్ము జిమ్ముచున్

8. ఎంత కృపారసాంబుధివొ! ఇంతని యెంచక చేతనైన సా
మంతము వారధిన్ సలుప మన్నన మచ్చిక జేసి మేని నా
ద్యంతము బట్టి చిట్టియుడుతన్ తనివొందగ బ్రామి, కాకము
న్నంతము సేయబూనక దయన్ క్షమియించితివయ్య రాఘవా!



9. ఎంతటి మెప్పు గల్గ నెవడేనియు బోయను గౌగిలించునే!
ఎంతటి యాకలైన నెవడేనియు నెంగిలి పండ్లు ముట్టునే!
ఎంతటి యాపదైన నెవడేనియు క్రోతుల నాశ్రయించునే!
వింతలు నీ ప్రసాదగుణవృత్తులు కొందరియందు రాఘవా!

10. గొల్లది తల్లి! స్నేహితులా గోపకుమారులు! దొంగిలింతలే
మల్లుతనాలు! నెత్తిపయి మచ్చల నెమ్మిలి ఈక! చేతలన్
పెల్లగు జూదరుల్ నటులె ప్రేముడి బాంధవు లెంచిచూడనీ
యుల్లము వెన్నపూస! లలితోత్పల నీలశరీర మాధవా!

11. రక్షామూర్తివి నీవెగాన పరిచర్యాదీక్ష గీర్తించెదన్
రక్షోభావములెల్లమాపి సుగుణవ్రాతంబుగీలించి సం
రక్షాపేక్ష నుపేక్ష సేయక జనుల్ రంజిల్లగా జేయుమా
వక్షస్సంస్థిత వైజయంతిసుషమాపద్బాంధవా మాధవా!

12. దయతో వేదములుద్ధరించి, గిరి మీదన్ మోసి, పూర్ణేందు కాం
తి యశస్స్ఫూర్తి ధరన్బరించి, నిగమోద్దీప్త ప్రకారంబుగా
నయరీతిన్ జను బాల వృద్ధ సుమనో నాశంబు వారించి, ర
మ్యయదుస్వామ్యము జూపి, బుద్ధమతినోమన్నీవెగా మాధవా!

13. తనకును దామోదరునకు
గనభేదము లేదటంచు గరుణాదృతియై
తనపని గాకున్నను విష
మును గొని ధృతి గాచు శంభు మొదలు గణింతున్

14. ఎవడాత్మలింగమును దయ
నివటిల్ల దశాస్యుకిడెనొ! నిర్భర కరుణన్
పవలున్‌రేలును బాణుని
గవనున గొలువయ్యెనట్టి కాలు భజింతున్

15. ఇల భోళాశంకరుడని
తలమీదకు దెచ్చుకొనెడి తరగని వరముల్
తులలేని కరుణ నిరుచే
తులగురిసెడి బిరుదుగన్న దొరను స్మరింతున్

16. **వీరరసంబు** ముట్టెకొన వెల్లువలెత్తగ విక్రమార్భటిన్
నీరధి వేదహర్త నవినీతుని కోరల నోటజీల్చి సం
హారమొనర్చి పద్మజునియార్తిని దీర్చిన మత్స్యమూర్తి! జో
హారులొనర్తు జన్మ పరిహారము వేడి విశేష భక్తిమై



17. ఎల్లరు జీవరాశులను నెప్పుడు మోసెడి వన్నెకాడ! సం
ఫుల్ల మనోబ్జవృత్తినొక పుల్లరి కొండను మోయుటెంత దు
గ్ధోల్లసితాంబుధిన్? సురల కోరికదీరగ వెన్నుమీద! నీ
కెల్ల విధాల, కూర్మపరికీర్తితమూర్తి! నమస్కరించెదన్

18. ముట్టెను ధారుణీమణి విమోహనలీల ధరింప, బల్మిచే
నెట్టెదుటన్ జెలంగు కనకేక్షణ రాక్షసుబట్టిచీల్చు మి
న్ముట్టిన శౌర్యదీప్తికి తమోహర సూర్య శశాంకులిర్వురున్
పెట్టిన కందుగా వెలుగ వెల్గెడి వేదవరాహు నెన్నెదన్

19. బాలుని విష్ణునామ పరిపాలుని దివ్యగుణాల వాలునిన్
ఖేలనశీలమాత్ర తనుకీలిత రమ్యవయోవిలోలునిన్
చాలిక! చూపరాహరిని సర్వమునందని చెండు తండ్రి బ్రా
ల్మాలక తోచి, చీల్చు హరి మానవవైభవలీల గొల్చెదన్

20. లీలగ రెండు మూడడుగు లిమ్మని వేడుటె కాక సర్వలో
కాల సమాక్రమించు ఘన గౌరవమొప్పద్రివిక్రమాకృతిన్
క్రాలగ జూపి, వంచి బలి గారవమొప్పుగగాచు వామనా
స్ఫాలకబాలకున్ వినుతి సల్పెద సర్వ శుభంకరమ్ముగాన్

21. కామము కన్న భావము వికారము ఘోరము సర్వనాశకం
బేమన! జీవకోటిగన నెందు దశాస్య విజృంభమాణ దు
ష్కాముకరీతియుంచు! ఘనకార్ముకవృత్తి సహంకృతిన్ తదీ
యామిత మూలబీజమును నంటదహించితివయ్య రాఘవా!

22. లీలామానుష విగ్రహుండు మురళీ లీలావినోదుండు క
ల్లోల క్ష్మాధరదీక్ష దౌష్ట్యముల నిర్మూలించు రక్షోగుణో
న్మూలధ్యేయపరాక్రమక్రముడు చిన్మూర్తప్రభావుండు గో
పాలగ్రామణి ప్రోచుగావుత శుభ ప్రారంభ సంరంభుడై

23. త్రిపురముల వ్రేల్చు పట్టున
విపుల రథారూఢుడగుచు విష్ణు శరముతో
నెపుడు గననట్టి యార్భటి
విపరీతుండయ్యె నట్టి వేల్పునుతింతున్

24. సంపదలన్నియు జనులకు
పంపకమొనరించి తానొ బయలు నెలవుగా
తెంపరియై వెలుగుచు పువు
నంపవిలుతు బిలుకుమార్చు హరు వినుతింతున్

25. లయకారుండయి యెవ్వడు
భయదాకారమున సృష్టి భస్మమొనర్చున్
దయమాలి, జీవ జనన వి
లయ చక్రము ద్రిప్పునట్టి రంహు నుతింతున్

26. వర శృంగారరసాలవాల! జగతీవాల్లభ్యదృగ్జాల! సౌ
ఖ్యరమాలోల! విలోలభక్తజన పద్మాక్షి ప్రభాలీల! దే
వర! వాగీశుని నాభిపద్మమున నొప్పంగన్న కన్నయ్య! భా
స్కర శుభ్రాంశు విలోచనప్రకర ముఖ్యా! సప్తశైలేశ్వరా!

27. గంధము భూమిలక్షణముగా తలపోయుటనేమొ! పుణ్యసౌ
గంధిని పృథ్విముట్టెకొన గాపురముంచ, హిరణ్యనేత్ర దు
ర్గంధిలకుక్షి జీల్చి సుఖలౌల్యము బాపి వరాహ! మోక్షమున్
సంధిల జేసి ఏలితివి సప్తగిరీశ్వర వేంకటేశ్వరా!

28. మల్లెలు జల్లినట్లు వనమాలిక వేసినయట్లు గందమున్
మెల్లగ బూసినట్లు తొడమీద వసించిన లక్ష్మి చేత సం
ఫుల్ల మనస్సుచేత పరిభూషిత కేసరి రీతివీడి కన్
చల్లగ జూచి కాచితివి సప్తగిరీశ్వర వేంకటేశ్వరా!

29. ఆరని కామవాసన కహంకృతి చేతికి జిక్కి రామ! దు
ర్వార భవాబ్ధియాతనల పాలగుచుండెడి యాత్మకన్య సీ
తారమణీలలామ పరితాపము మానిపి యంకపీఠి సం
స్కారము మీర నిల్పితివి సప్తగిరీశ్వర వేంకటేశ్వరా!

30. అష్ట విభూతులన్ బరగునయ్య వలెన్ నవరత్న దీపికా
వేష్టితకాంతి నీలమణివీవు జెలంగుచు వేణునాద సం
తుష్టిని యష్టభార్యల నితోధిక సౌఖ్యములందు దేల్చ వి
స్పష్టముగా వరించితివి సప్తగిరీశ్వర వేంకటేశ్వరా!

31. ఎక్కెడి కొండగా దిగెడి ఈవలికొండగ నిద్దరమ్మలన్
చక్కెర బొమ్మలన్ సరిగ సాటిగ నేలగ నేగు నీదు పెం
పెక్కిన నీలమేఘ తనువీధిని దోచెడి చెమ్మ ముత్యముల్
చక్కని తారలై వెలుగు సప్తగిరీశ్వర వేంకటేశ్వరా!

32. స్వరములు నేడుకొండలయి సన్నుతరీతి నుతించ, పావనో
త్కరములు సామవైదిక విధానములెల్ల భజించ, వైరిదు
ష్కరములు శంఖచక్రముఖ సాధనముల్ గమకించ విశ్వవి
స్తరములు నీ కటాక్షములు సప్తగిరీశ్వర వేంకటేశ్వరా!

33. కాముని గాల్చిన కన్నున
గోమలి గిరిపుత్రి కేలిక్రొందామర పూ
వామని పొడి జల్లిన జే
గ్రామకొనగ నెరుపు బెరుగు భవు భజియింతున్

34. కననెంతటి ప్రేముడి గ
ల్గిన తలమునుకలుగ నాలికెవ్వండైనన్
తన మేనుగోసి యిచ్చెనె?
కొనుమంచును నట్టివాని గొప్ప నుతింతున్

35. నటరాజు సుందరేశ్వరు
గటక మహానాగయుక్త కంఠోత్తము సం
కట హారిని శృంగారిని
నిటలాక్షుని వశ్యగాంగనిధి వినుతింతున్

36. హాస్యరసమ్ముగాదె! పదహస్తము లెవ్వియు లేని చేప ది
వ్యాస్యముతోడ దైత్యవిభు నక్కడి కక్కడ బట్టి వార్ధిలో
నస్యమువోలె బిట్టు పొడి నాడెముగా వడిగొట్టెనన్న! నే
దాస్యము సేతుగాని 'అవధారయ!' యాదగిరీంద్ర చంద్రమా!

37. చిప్ప తనెంత గట్టిదయి చేవయు గల్గిన గొండ మోయునే
గొప్పలు గాక! క్షీరధిని గూలక కూర్మము నార్త రక్షణన్
తెప్పయితేల, నారియయు తీపి సుధల్ సురపంక్తి బంచ నీ
త్రిప్పలు వందనీయములు! తేపకు యాదగిరీంద్ర చంద్రమా!

38. వాలముతోడ గొట్ట శశిభాస్కరులూదిన దూదిపింజలై
కాలముదప్పి నింగి కడగట్టున కావల దూలి సోలుచో
నేలను ద్రవ్వ పందియొక నిర్భతి ప్రాణముదీసెనన్న చి
త్రాలకు మ్రొక్కులేనిదెద దైవమ! యాదగిరీంద్ర చంద్రమా!

39. వింతయె! నీకు నీవె హరివీరనరాకృతి బూని బాలకు
న్నెంతయు వేధసేయు పితనెక్కడ జూడని రీతిబట్టి గో
రంతల కొండయంతమెయి నాంత్రములెల్లను జీల్చి వైచి క
ర్మాంతము సల్పినాడవట మానక! యాదగిరీంద్ర చంద్రమా!

40. ఎక్కడి పొట్టి! మూదడుగులేమనివేడుట లిత్తునన్నచో
నిక్కి యనంతసీమలను, నిమ్న జగమ్ముల రెంటిచేతనే
యుక్కివమొప్ప గొల్చుకొని యుండక, దానబలీంద్రు మేల్తలన్
ద్రొక్కుటమేలె! అట్టడుగు దోపగ యాదగిరీంద్ర చంద్రమా!



41. మాతయసూయచేత, ఘనమాయల దైత్యుల చేత, కంటక
వ్రాత యరణ్యమార్గముల బాధలనోర్చుట; పక్షిచేత, చీ
కై తనువెల్ల గ్రుంగునొక యంతటి బోయెతచేత, క్రోతులన్,
మాతలిచేత రామ! వెత మాన్పుట – యాదగిరీంద్ర చంద్రమా!

42. టక్కరిదొంగ! వెన్నలకు టక్కుటమారములెల్ల జేయు పే
రెక్కిన బుంగ! కన్నెలకు నెన్నెలకున్ తెగబారు రంగ! పై
కెక్కెడి రాక్షస ప్రకృతి నెంతయు ద్రొక్కెడిగొంగ! ఏమనన్
చిక్కులచుక్క కృష్ణ! పరిశీలన యాదగిరీంద్ర చంద్రమా!

43. నగుబాటు గాదె ఈశ్వర!
తగు భక్తులు సాలె పాము దర్పితగజమున్
నగకన్య గంగ పెండ్లము
లెగబడు కాపురము బయట నింట దలంపన్

44. ఒకదానికొకటి పొసగని
కొకిబికి ఎగుదిగుడు కన్నుకూడలి! యభవా!
వికసించు పూర్ణచంద్రుని
మొకమున నెలవంక నొక్కమూల గణింతున్

45. ఎత్తగ తిరిపెము డ్రావగ
మత్తెక్కించెడి విషమ్ము మంటల చితులన్
పొత్తులగు బూది పూతలు
నొత్తులు నెన్నొత్తినను శివోహమె కడకన్.

46. రౌద్రరసమ్ము రూపుగొను లాగున సోమకు నోటబట్టి మేన్
ఛిద్రముగాగ కోరలను జీల్చుచు చేటల బోలు రెక్కలన్
భద్రత బాయగొట్టుచును వారిధి నెత్తుటి ఏరుగా మహో
పద్రవరీతి మత్స్యమయి భాసిలు భద్రగిరీశ రాఘవా!

47. మోసపువేసమొప్ప సురముఖ్యుల పంక్తి సుధారమ్ము పై
నాసగ నొక్క దానవుడు నాసనమందగ సూర్య చంద్ర సం
జ్ఞా సముపేతయై భయదచక్రమునన్ మెడగోయు మోహినీ
శాసనమూర్తి! రమ్యగుణ సాగర! భద్రగిరీశ రాఘవా!

48. అనయము ఘుర్ఘురార్భటిననంతము బ్రద్దలు గొట్టిపోయు తీ
రున భయదమ్ముగా గనకలోచను కోరలగాల్లజీరి, ము
ట్టెను నెలకొల్పి భూమినొసటిన్ రిపురక్తము దిద్దు ఘోణివై
తనరిన శౌర్యమూర్తి! భవతారక! భద్రగిరీశ రాఘవా!



49. కన్నుల విస్ఫులింగములు గ్రాలగ, నోటను భీకరధ్వనుల్
మిన్నుల గర్జసేయ, మిడిమేలపు రాక్షసుజీల్చుగోళ్లు బ్ర
చ్ఛన్న సుదర్శనాంచల నిశాత విశేషములై చెలంగ వి
చ్ఛిన్న విరోధి సంఘమగు సింగమ! భద్రగిరీశ రాఘవా!

50. పండిన చింతనిప్పుకల భంగిని మండెడి కన్నుదోయితో
భండన భీమమూర్తి బగబట్టిన గొడ్డలి బట్టి యెల్లెడల్
నిండిన క్షత్రియాధముల నేలను గూల్చుచు భార్గవుండిదే
రండనుచున్ తలల్ చిదుములాడెదు భద్రగిరీశ రాఘవా!

51. భద్రమురూపు, ప్రాపయిన పార్వణ చంద్ర మనోజ్ఞకాంతి ని
ర్ణిద్రము మోము, రాగసుధ నించెడి కన్నులు తల్లక్రిందులై
ఛిద్రము జేసెనెట్లు దశశీర్ష దురుద్యమ గర్వరాజమున్
రౌద్రత బ్రహ్మబాణమున వ్రయ్యగ భద్రగిరీశ రాఘవా!

52. కాంతి నదమ్ము రూపమున గాలువ లెత్తుచు కాలిదొన్నెలన్
వంతులతోడ నిండి భువి బారగ సత్కరుణా ప్రవాహమై;
వింతలు! దుష్టరాక్షస విభేదన పాటవమైన పూనికల్
ఎంతని వేణులోల! గణుతించగ భద్రగిరీశ రాఘవా!

53. భగభగ మండెడి కన్నున,
భుగభుగ బుసబుసలు గొట్టు ఫూత్కారములన్
నగలెగయుచుండ, శూలము
ధగధగ రౌద్రమ్ము జిమ్ము దైవము గొలుతున్

54. అలసతి దక్షుని యజ్ఞము
బలియగుటకు రుద్రువీరభద్రుని బ్రతిగా
చెలగించి పీచమడచిన
విలయ మహోగ్రహ విలోల విగ్రహుదలతున్

55. అలికపు కన్నునసైనను
బలియుల త్రిపురాసురులను భస్మము సేయన్
వలను పడకున్న విష్ణుశ
బలశరమున గూల్చివేయు భవువినుతింతున్

56. కనగ భయానకంబయిన గాధరసమ్మును నూరిపోయు స
ద్వినుతము మీన సంభవము! వేదములన్ హరియించు దైత్యుజీ
ల్చిన భయకంపనప్రదము! రిక్కలు దిక్కులు గానరాని తీ
రున మను నొక్కటే జలధిలోలము! చీకటి ముంపు లోపలన్



57. ఎంతటి కొండ! చుట్టినదొ ఎక్కటి ఘోరవిషంపు పాము! అ
త్యంతము మోయగా వలతి యానొకొకూర్మము! చెప్పిచూడ వే
దాంతముగాదు! చూచుటకె యంతములేని భయమ్ము బుట్టు శ్రీ
కాంత! అసాధ్య సాధకము గాదె భవత్పద సన్నిధానమున్

58. తోకను గొట్టినంతటినె తోయజమిత్రుడు తారకాప్తుడున్
లోకములన్ని దాటి పడిరో యననెంత భయంకరమ్మొ నీ
సూకరవృత్తి! దేవ పరిశోషణు నిల్వున జీల్చివేయు దం
ష్ట్రాకర పాద శాతనఖ శస్త్ర! దిగంచల వస్త్ర శోభితా!

59. స్వరము వికస్వరమ్మనల భాస్వర పుంజము లక్షిగోళముల్
ఖరకర దంష్ట్రలక్షతనఖప్రకరంబులు వజ్రతుల్యముల్
వరుస సువర్ణకశ్యప విపాటన ఘోరవధ ప్రకారముల్
పరమ భయావహంబులయి పద్మభవాదుల భీతి ముంచెడిన్

60. కొట్టినచోట గొట్టకయె కొట్టెడు రాజ శిరమ్ములభ్రమున్
బట్టి కఠోరకాలు నెదబట్టి భయంబున నెట్టివేసెడిన్
బిట్టుగ నట్టహాసములు! భీకర భార్గవరామ! రామ! యం
చుట్టిపడన్ విరావములు నున్ముఖ మారుత గర్భభేదముల్

61. ఎంత రసార్ద్రశీకరమొ యంత భయంకరమయ్య రామ! దు
ర్ధాంత పరాక్రమక్రమ విరాజితమౌ భవదీయనామ మా
ద్యంతము సార్థకమ్ముగ విధానములన్ గనిపెట్టువేళ న
త్యంతము గొట్టువేళ నిరయంచుల వాడిమి పోడిమిన్ దగన్

62. పరమ భయానకంబగుచు భాసిలె ఫల్గుణునంతవానికిన్
బరువయి చూడ హస్త ముఖ పాదసహస్రము విశ్వరూపమ
క్కర నతివేలమై! మొదలునంతము జిక్కక పద్మనాభ! ఎ
వ్వరు నిను బట్టగా వశము? భవ్యమనస్కత, భక్తిగల్గినన్

63. ఒక్కటి పవలును గనలే
దొక్కటి రేయిని, గణింపనొక్కటి పవలున్
చిక్కటి రేయిని మండుట
నిక్కువము విరూప వికట నేత్ర! నమస్సుల్

64. భయమును గల్గదె మరి! పరి
చయమున్నను గాంచ దాసచయము బరేతా
శ్రయము, శ్మశానము బూడిద
మయము నివాసమును భక్తమందార! హరా!

65. చేరిన ముంచదె గంగ! వి
చారవిదూరములు నందజము లడలింపన్
బారవె! కోరుట ఎటు నిను?
మారవిరోధమున మందు మాన్య చరిత్రా!

66. వర బీభత్సరసమ్ము ప్రోదిగ పురోభాగస్థ వేదాళి త
స్కరు వెంటంబడి పట్టి చీల్చి వపమాంసంబున్ వెసన్ దిగ్దిగం
తరదేశమ్ములనెల్ల బిండములుగా ధర్మ ప్రదానంబు జే
కుర గావించెదు మీనలోచన! హరీ! గోవిందకావంగదే!

67. ఎవ్వడు గాని ఖండనము నెవ్వనిజేసిన రెండు ముక్కలై
నివ్వటిలంగ ప్రాణమపనీతముగా జనుగాని; శీర్షమున్
క్రొవ్వినమొండెమున్ విడిగ కోల్లలయెత్తునె భీకరమ్ములై
యవ్వ! జుగుప్సకాకరములై కమఠోపరిపాద మాధవా!

68. పలలంబున్ దిననట్టి పంది యొక లోభస్వాంతుబల్లార్చి లో
పలి భాగంబులనెల్లగొల్లగొని దిగ్భాగంబులన్ జల్లుటల్
తలమే లోకమునందు నెచ్చటను! నీ ధర్మావనోత్సహా స
త్ఫలితాంశంబది కాక! ఆర్తిపరితప్తానంద సంవర్ధనా!

69. వేరుగ నెన్నగా వలెనె! వేల్పుల జీవుల భక్తకోటి ని
ష్కారణ వైరవృత్తి నపకారము సేయగ బూనువారి దు
ర్వారగతిన్ విచిత్రముగ బట్టి భయంకర ఘోరలీల సం
హారము జేతువీవని! మృగాధిపమస్తక పూరుషోత్తమా!

70. చెండులవోలె నంతటను జిట్లిపడన్ నరనాథ శీర్షముల్
మెండగు గండ్రగొడ్డలిని మేకొనిపార తదసృగాపగల్
ఖండములైన కాయముల గాకుల గ్రద్దల పాలొనర్చు దో
ర్దండ పరాక్రమా! పరశురామ! నుతింతు భవద్విజృంభణన్

71. ఎక్కడబోయె మెత్తదనమెత్తిన వింటిని దించకుండ నీ
వుక్కడగించగా నసురయోధులనేరిచి పూట పూటకున్
దిక్కరి పీన్గుపెంటలయి దిక్కులు దిగ్భ్రమ నిల్చి చూడగా
నెక్కటి బంటువై రఘుకులేశ్వర! విశ్రుత విగ్రహమ్ముగా

72. గురువుల వృద్ధ బాంధవుల గూడిన తమ్ముల బావమర్దులన్
పరువడి జంపజేసిన కృపారహితంబగు ధర్మదీక్షనే
యొరవడి జేర్చగా నగు! రణోర్వికి భారత వీరులందరున్
గురుబలిగాగ చక్రమును గూర్చిన మాధవ! నీవెరుంగవే?

73. ఉరమున రుండపు దండలు,
కరమరుదగు కాటియున్కి, గజచర్మంబం
బరముగ నుడుగక నొప్పెడి
పరువులు నీకమరెనీశ! భైరవగతులన్

74. రుద్రాక్షలతో, విషధర
ముద్రలు బెనవేసుకొనిన మురువు నగలతో,
రౌద్రపు ఫాలాక్షముతో
భద్రుడవై యెసగుదేవ! పరివేష్టింతున్

75. రాక్షస భూత పతిత్వము
నక్షత లయకారపథమునను శీలింపన్
దక్షుని యజ్ఞధ్వంసము
నక్షర బీభత్సగుణము నతుకు మహేశా!

76. వరలున్ లోకమునందు **నద్భుతరస** ప్రామాణికంబై భవ
ద్వర మీనాకృతి! చేపయెక్కడ? సముద్రాంతస్థ వేద ప్రభా
హర దుర్వార సురారి జీల్చుటలనన్! హస్తాంఘ్రి శస్త్రాస్త్రముల్
నరుదై యుండగ నెట్లు గల్గె? బదరీనారాయణా! మ్రొక్కెదన్

77. బలభిన్మిత్రులు దైత్యశక్తులు సుధాపానంబు వాంఛించి మే
ల్తలయున్ దోకగ పాముబట్టి జలధిన్ ద్రచ్చంగ చిత్రంబుగన్
బలువైనట్టి గిరీంద్ర భారమును బ్రాపై మూపుపై లీలగన్
నలుసుంబోలిక మోయుకూర్మ! బదరీనారాయణా! మ్రొక్కెదన్

78. పరమున్ గోరక భోగలాలసత సర్వాధార భూగోళమున్
చెరబట్టంగ హిరణ్యనేత్రునొక దుశ్చింతున్ వెసన్జీల్చి సూ
కర! ఆధారము లేక నాయుధములేకన్ ముట్టెశృంగమ్మునన్
నరముల్ దీసినయట్టి జెట్టి! బదరీనారాయణా! మ్రొక్కెదన్

79. తిరమై పొల్చెడి గట్టి మూర్ఖత దలన్ దీయింతు నెందైన శ్రీ
హరిగీర్తించిన నెవ్వడైననని ప్రహ్లాదున్ బ్రకోపించు ని
ర్జరవైరిన్ దయనీయ వైఖరిని తార్చై ముక్తి బొందించి పె
న్నరకానన్ బడకుండగాచు బదరీనారాయణా! మ్రొక్కెదన్

80. ఛలివై యొక్కటి రెండు మూడడుగు లిచ్ఛాపూర్తి నిమ్మంచు దో
ర్బలి నర్థించి యతండు వల్లెయన దుర్వారంబుగా వెల్గి లో
కులలోకమ్ముల రెంట గొల్చుకొని తక్కుంగల్గు మాత్రంబు జ
న్మ లవిత్రంబుగ జూచికాచు బదరీనారాయణా! మ్రొక్కెదన్



81. శరసంధానమునందు మిన్నవని దేశంబందు మిన్నంది వా
నర సాహాయ్యము గోరుటద్భుతము దైన్యంబూని, లోకంబు ది
క్కరెనే రావణుగూల్చ? ధర్మమును నిక్కంబైన రూపంబుతో
నరలోకంబున నిల్ప? రామ! బదరీనారాయణా! మ్రొక్కెదన్

82. లలితప్రాకటచిత్త, వత్సలత మారాకెత్తు సన్మాత, పే
శల చాంద్రీమయభావజాలగన నాస్యంబందు వేధోండ జా
ల లసద్గోళములెత్తి చూపుటలు దిగ్భ్రాంతంబుగాదే! భవా
నలసంతాపమునందు నెందు బదరీనారాయణా! మ్రొక్కెదన్

83. దోసెడు బూడిద, వేసెడు
మీసరపు విషోరగములు, మేయ గపాల
గ్రాసము, మంగళకరమగు
వేసము నీదెట్లు? కన వివేకము వలయున్

84. సగమై కులుకుల తళుకుల
నగజాత జెలంగనెట్లు నారీశ్వర! నీ
వగలింతువా లోకములను?
మగటిమి జెరలాడ బ్రళయ మాసములందున్

85. చక్కటి చూపులు లేకయె
మిక్కుటమగు వనట గ్రందు మీదౌ జనులన్
అక్కటికనెటుల నేలెదౌ?
అక్కజమగు నీదులీలలభవ! తలంచన్

86. **శాంతరసా**శ్రయుండవయి సాగర గర్భమునందు వెల్గు వే
దాంత శిరోమణీ! మణిమయాంచిత శీర్షసహస్రసర్ప త
ల్పాంతర శాయి! పద్మజ విరాజిత మంగళ భవ్యమూర్తి! క
ర్ణాంత విశాల లోచన! దయా పరిపోషణ! దోషశోషణా!

87. కపిల మహర్షి! సాంఖ్యమత గంధము విప్పగ, వేదశాస్త్రముల్
కృపను వహించి సత్కథల రీతుల జెప్పగ బాదరాయణా!
విపులతరోగ్ర కల్మష వివేక విహీనత లెల్లమాపు భ
క్తి పథమె ముక్తి మార్గమని కీర్తన నొప్పిడి నారదా! హరీ!

88. మీనంబై గిరిమోసి భూమిసతినున్మేషంబుగా నిల్పి స
న్మానంబొప్పగ బాలభక్తునభిమానంబున్ గటాక్షించి ఎం
తైనం గాంచగలట్టి యున్నతిని సంస్థాపించి రక్షో గుణ
స్థానంబుల్ తెగటార్చి శాంతగతి నుద్ధరించు నారాయణా!



89. ఎంతటి శాంతమో! తెరపికెక్కిన సౌఖ్యపుమూట రాజ్యమా
సాంతమసూయచేత జెయిజారిన నింతయు గిన్కలేక శ్రీ
మంతమరణ్యవాసమని మాన్యత నేగుట జూడ దైత్యరా
దంతము జేసి ధర్మమును హాయిగ నిల్పుటకేమొ రాఘవా!

90. పాలిపగల్ బరాబరిగ బైకొని ధర్మువునెల్ల నల్లక
ల్లోలము జేయుటొక్కటి, విరూపము నందక వృద్ధిబొందు ను
ద్వేల జనమ్ము చేత భువిద్రేగయి క్రుంగుట యొక్కటైన గో
పాల! సమగ్ర శాంతగతి బంచగ భారతయుద్ధమూనితే!

91. నవ్వుల కన్నులన్ నొసట నాట్యమొనర్చెడి శాంతదీప్తిచే
బువ్వులు జల్లి సంఘమును పూతపటిష్టము సుస్థితమ్ముగా
మవ్వము జేయగాదలచి మానిత బుద్ధ విశుద్ధ సిద్ధులన్
రవ్వల రంగవల్లికల రాసులుగా సవరించితే భువిన్

92. తప్పగనీని యోపిక నిదానము నీగుణమై ప్రసాదమై
గొప్పలు బోని సత్వగుణ కోశము మోసము లేని వేసమై
యొప్పగ లోకరక్షణ దిశోన్ముఖవృత్తి వహింతువేమొ! క
న్నప్పు! అనంతకల్మషములార్పి కృపామతి గావగా దగున్

93. ఇద్దరు పెండ్లములుండియు
నెద్దరి శాంతముగ నుండ నేర్చితివది వా
రిద్దరికే తెలియగనగు
బెద్దరికము బేరు పెంపు బెరుగ మహేశా!

94. నిత్యము శాంతము తపము న
పత్యములై వెలుగ భక్తపాలనమున సాం
తత్యము గొనసాగగ సా
పత్యము శుభకరుల యెడల బరపు మహేశా!

95. ఎప్పుడు తారక మంత్రము
దప్పని చిత్తమున జెలగు దర్పకహర! ని
న్నెప్పుడు దలచెద నుడుగక
దప్పులె యొడగూర్చు నన్ను దయదలచుటకై

96. ఎక్కడి మాయగ్రమ్ముకొనె నెంతయు దిక్కును మొక్కులేని పెం
జిక్కుల గూలద్రోయుచును జీల్చి భుజించుచునున్నదయ్య! నీ
వొక్కడె దిక్కటంచు గుణమో వ్రణమో దరిజేర్పవేడెదన్
తక్కిన దిక్కుమాలిన పథమ్ములు నమ్మక జ్ఞానభాస్కరా!

97. ఎవ్వనికెవ్వడీ జగతి నెన్నగ నందరకీవెగాక! రా
నివ్వగనీక నొవ్వలను నిత్యము పువ్వులవోలె లిప్తలన్,
బువ్వము బంతివోలె బరిపూర్ణ మొనర్చుచు బూటపూటలన్
నవ్వులదొంతిగా గడప నాకభయమ్మిడుమయ్య మాధవా!

98. తప్పించుంకొనబోకుమయ్య! అది నీదౌ పూర్వకర్మంబటం
చొప్పంజెప్పుచు, నీవు బూనుకొన నెచ్చో కర్మముల్ బంధముల్
రొప్పంజాలునె జీవకోటి! కరుణారోపంబుగా జిక్కులన్
విప్పంబూనుము జాగుసేయక మనోవిశ్రాంతిగా నచ్యుతా!

99. వలపు వలల్, తిరస్కరణ భాషణ కుంతము లీర్ష్యబాణముల్
కెలకుల లోభముద్గరలు, కేరడముల్ నురులై బిగించగా
వలపల డాపలన్ శునకవర్గపు బంధుగణమ్ముదోలగా
కలతలకాపురమ్ము దరిగందకమందునగూల్చదే హరీ!

100. పస ఏమున్నది కాలకంధర! స్వయంప్రారబ్ధకర్మమ్ము రా
క్షస మార్గమ్ముల రాచిపెట్టక నుపేక్షల్ సల్పునే యెందు? శ
త్రు సమానంబయి యొంటబుట్టిన రుజాదోషంబు రూపై, విరూ
ప సమాలోకన శక్తి గర్మముల దౌర్భాగ్యంబు మండింపవే!

101. పాదద్వంద్వము మట్టుగా, తనుపురోభాగంబు కాండంబుగా,
మీదన్ గ్రాలు శిరమ్ము దొన్నెగను, నామేనెల్ల కంబంబుగా,
ప్రోదిన్ నాడులు వత్తులై, నొసటి దీప్తోత్సాహ భక్తి ప్రప
త్త్యాదుల్ నూనెగ వెల్గనిమ్ము పరమాత్మా! ఆత్మదీపప్రభల్.

